# కవితామాలతి 2

## విషయసూచిక

## II. సమాజం 24

# పరిచయం

కవితామాలతి శీర్షికతో 2012లో ఒక సంకలనం చేసేను. ఆ తరవాత అప్పుడప్పుడు ఏవో రాస్తూనే ఉన్నాను కానీ వాటిని సంకలించలేదు.

ప్రధానంగా ఏవో ఆలోచనలు వస్తే, వాటికి కథ లక్షణాలూ, సరంజామా లేకపోతే ఇలా అక్షరగతం చేస్తూ వస్తున్నాను. **కవితామాలతి** పేరుతో వెలువడిన మొదటిసంకలనానికి ఆదరణ బాగానే లభించింది. అంచేత, అందులో చేరని రచనలు ఇలా మరొక సంకలనంగా వెలువరిస్తున్నాను.

అమెరికా వచ్చి అర్థశతాబం దాటింది. అంటే నాజీవనకాలంలో సగానికి పైగా ఇక్కడే ఉన్నానన్నమాట. ఎంత కాదనుకున్నా ఇక్కడి జీవనవిధానంతో అనుబంధం ఏర్పడింది వ్యావహారికంగానూ బౌద్ధికంగానూ కూడా. అంచేత నారచనలలో అనేకభావాలు నాఅమెరికా జీవితానికి అనుసంధానం అయి ఉన్నాయి. ఇండియాలో ఉన్న కొందరికి సందర్భం తెలియకపోవచ్చు అని కొన్నిచోట్ల వివరణలు ఇచ్చేను. రచనలను నాలుగు భాగాలు చేసేను విషయానుకూలంగా. కొన్నిరచనలు విషయపరంగా అటూ ఇటూ అయిఉండవచ్చు. పాఠకులు గ్రహించగలరనే నాభావన.

ఇంతకుముందు చూడనివారికోసం మొదటి సంకలనానికి లింకు ఇస్తున్నాను. నేను మళ్ళీ ఇప్పుడు చదువుకుంటుంటే నామూలతత్వంలో ఏమీ మార్పు రాలేదని తెలిసింది. -:).

కవితామాలతి (2012). అప్పట్లో మరోసంకలనం చేస్తానన్న అభిప్రాయం లేనందున ఆ సంకలనాన్ని కవితామాలతి 1 అని పేరు పెట్టలేదు.

మీఅభిప్రాయాలు ఆదరణీయం.

నిడదవోలు మాలతి

డిసెంబరు 25, 2023.

# 1. సాహిత్యం ఒక చదరంగం

కథకోసం కథ చదువుతారు కొందరు.
కాలక్షేపంకోసం చదువుతారు మరికొందరు.
ఎవరికి వారు తమకి నచ్చిన, కనిపించిన, కావలసిన కోణాన్ని చూస్తారు.
అలా కాక,
విదులు ఇలా ఉండాలి అలా ఉండాలి అని తీర్పులిస్తారు.
అప్పుడు గుర్తొస్తుంది నాకు "చేయలేనివారు చెప్తార"న్న ఇంగ్లీషుసామెత
నిజంగా స్వయంగా మంచికథ రాయలేనివారు.
కథలో అన్నికోణాలు నిర్దిష్టమైన అవగాహన లేనివారు.
చేసే విమర్శలని ఆదరించేవారు కూడా ఉంటారు.

అందుకే అంటాను సాహిత్యం చదరంగమని,
సాహిత్యక్షేత్రంలో మనికికి ఎత్తుకు పైఎత్తు వేయాలి.
సిద్ధాంతాలు, రాద్ధాంతాలు చేసుకుంటూ పోవాలి.
అమ్మమ్మలూ, నానమ్మలూ చెప్పినకథలు కాదు.
ఈనాడు రచయిత చాణుక్యుడు కావాలి.

మార్చి 21, 2023.

## 2. గుర్తింపు

ఏకాలంలోనైనా ఏరంగంలోనైనా
ఒకరికృషి మరొకరు గమనిస్తేనే అస్తిత్వం.
గుర్తించడం అంటే పొగడ్తలు గుప్పించడము కాదు.
ఆకృషిలో తాము గమనించిన ప్రత్యేకతలను చెప్పడం.
చరిత్రలో అనేకరచనలు అంతర్ధానమయి ఉండొచ్చు.
కారణాలు బహుముఖీనం.
అప్పట్లో ఆదృష్టి లేదు, ఈనాటివసతులు లేవు,
ఇప్పుడు అయింది ఒక్కరిద్దరికి పొగడ్తలవరదలు
మిగిలినవారిని నామమాత్రంగానైనా తలుచుకోరు.
అదే విచారకరం.

[ఏసభలలో చూసినా ఉపన్యాసాలు గురజాడతో మొదలుపెట్టి చలం, కుటుంబరావు, అంటూ ముగుస్తాయి.
పద్మరాజు తెలుగుకథకి అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చాడంటారు. ఎవరు?
తెలుగువారిలో కొందరు ప్రముఖులు మాత్రమే. ఇంకెవరికీ తెలీదు.
సమతుల్యంలో రచయితలను గౌరవించడం - అతి మితి కాక సమతుల్యంలో - మళ్లీ వచ్చేవరకూ
రచయితలగుర్తింపుగురించి విచారం వెలిబుచ్చడం మాత్రమే కొనసాగుతుంది.
కొందరు అడిగి చప్పట్లు కొట్టించుకోడం కూడా బహుశా ఆదారిలోనే సాగుతోందేమో.
శతకోటి దారిద్ర్యాలకు అనంతకోటి ఉపాయాలు.
రచయితకు గుర్తింపు ఊపిరి. పొగడ్త వైయక్తికం. కొండొకచో కువిర్శలు. వాటిని గౌరవించలేదని మొత్తుకోళ్లు.]

000

మే 22, 2023.

## 3. పోపులడబ్బా

మనిషి ఒక పోపులడబ్బా
ఆవాలు, మెంతులూ, జీలకర్రా, సింగినాదం
చిన్నచిన్న డబ్బీలలో.
అన్నీ కలబోసి వేయిస్తేనే పోపు.
పేర్లు పెడితే శాస్త్రం
ప్రయోగాలు పామరత్వం.
ప్రయోగాలు శాస్త్రాలయేక
పామరులప్రయోగాలలో అపభ్రంశాలఅన్వేషణ.
స్త్రీవాదం, తీవ్రవాదం, మితవాదం, భాషావాదం, భేషజాలవాదం
మానవతావాదంలో భాగాలని మరోవాదం
ఏదో ఒక ముద్ర ఆబోతుమీద అచ్చులా.
వాదాలకి అతీతం అంటే నేరం.
సమానత్వంకోసం పోరాటం
నాభావాల ఆక్షేపణే పరిహాస్యాస్పదం..
తాతాచార్యులవారి ముద్ర భజం తప్పినా వీపు తప్పదు.
అప్పుడు అక్షరాలలో జీవించేను.
ఇప్పుడు వాదనలకు దాసోహం. కాకపోతే
అయిపోవాలి అంతర్ధానం.
ఈనాటి సాహితీరంగం ఒక చదరంగం.

మార్చి 19, 2023

## 4. అహంభావసారూప్యం

ధనంకంటె
అధికారంకంటె
బలమైనది అహం.
ఈనాడు ప్రపంచం సమస్తాన్ని
నడిపిస్తున్న ఏకైక సూత్రం స్వాతిశయం.
"నాకేమి లాభం" మొదటి ప్రశ్న.
స్నేహాలు, ద్వేషాలు,
చేతులు కలపడాలూ
తన్నుకు చావడాలూ అన్నీ
ఒక స్వప్రయోజనం ఆశించే.
సాహిత్యంలో భావసారూప్యం సహితం
అహంభావసారూప్యం అయింది.

(జులై 12, 2021)

## 5. ఒక కవిప్రశ్న

అలనాడు అమ్మమాట వినిన ఈనాడు కచేరీల చేయనా?
నాన్నమాట విన్న న్యాయవాదిని గానా?
గురువులమాటలాలకించిన నెర గురువునౌదు గద.
ఏ సలహా ఎదను నాటక గద ఈదరి చేరితి.
రాతపనిలో పడగ కుదిరె లోకమును ధిక్కరించ చేవ.
అలా అనకు, ఇలా చేయకుమనువారిమాట విననాతరమె?!
ఎనిమిదిపదులు దాటె గదా
ముదిశునకములకు క్రొత్త విద్దెలు నేర్వనగునె, విదులార?

7.14.2023

## 6. నాకలము నానాకము

మనసుచీకటికోణాల్లో దాగిన “నేను” నాకలం.
ఎదురుపడి చెప్పలేని భావాలు ఒలికిస్తుంది
నోట పలుకని వేదన రూపిస్తుంది.
ఆప్తమిత్రమై అనునయిస్తుంది.
ఆతెలిమబ్బులచాటున ఎనలేని మర్మాలు
ఆ మొగ్గలు రేపటి రోజాలు
రాత్రినుంచి పగటికీ, పగటినుంచి రాత్రికీ
నిరంతరప్రయాణం.
000
(ఆగస్ట్ 6, 2021)

## 7. అక్షరస్థితి

చుక్కలు గీతలై, అక్షరాలై
పదాలై వాక్యాలై
పేరాగ్రాఫులై, పేజీలై
ఏరులై పరుగులు పెడుతున్నాయి..
మంది మీరినఇంట మజ్జిగలా
భావాలు నీరుగారిపోయి
పలుచన పలుచగా పారుతూ పోతున్నాయి.
గాలివాటుగా నాలుగుచెరగులా చెదిరిపోతున్నాయి.
నామాట నానోట పొగమంచులా కరిగిపోయింది
ooo
(ఏప్రిల్ 10, 2019)

## 8. ఆడెనదే వాగ్దేవి

మొన్న మననాలుకలపై
నిన్న కాగితపుకట్టలలో
ఈనాడు కీబోర్డులమీద.

## 9. రాయడం నిత్యకర్మ

రచయిత నిర్విరామంగా రాస్తూనే ఉంటాడు
మనసులోనో కాయితమ్మీదో
మనసులో మనసుతడికోసం
కాయితమ్మీద స్పందించేపాఠకుడికోసం.
ooo

## 10. నీమాట

నువ్వాడిన ప్రతిమాటవెనకా చెప్పనికథ ఒకటుంటుంది.
అదేమిటో నాకు తెలీక జవాబు చెప్పలేను నేను.
గుండె చిక్కబట్టుకు చెప్పినా నప్పదు.
నప్పకున్న మాట చెప్పనేల అని ఊరుకుంటాను
ooo

## 11. నన్ను నన్నుగా నిలబెట్టినవి!

గగనసీమలకెగసిన మహావృక్షం
దిగంతాలకు పరుచుకున్న మహార్ణవం
హృదయవైశాల్యాన్ని చాటుతున్న ఆకాశం
భూమిని కరిచిపట్టుకున్న పర్వతశ్రేణి
నాఅస్తిత్వానికి గురుతులయి శోభించేయి
ఉన్నచోట ఉన్నట్టు
నన్ను నన్నుగా నిలబెట్టేయి.
(ఆగస్టు 5, 2021)

.క. మామూలుగా మన అల్పత్వాన్ని గుర్తు చేస్తాయి అనుకోవచ్చు. కానీ నాకు అలా అనిపించదు. వీటిని చూసినప్పుడు మరింత ధైర్యాన్ని, ఆత్మనిగ్రహాన్నీ, ఆత్మవిశ్వాసాన్ని కలిగిస్తాయని చెప్పడానికి ప్రయత్నించేను.

## 12. మనోవల్మీకం

నాహృదయంలో
పాములే ఉన్నాయో
చీమలే ఉన్నాయో
చీమలు పెట్టినపుట్టలో పాములే చేరేయో
నీకు తెలీదు.
ఏదో ఒక ముద్ర వేసేస్తావు.
తాతాచారివారిముద్ర భుజం తప్పినా వీపు తప్పదని
ఆబోతుమీద అచ్చు వేసేవు నువ్వు.
ఇక నాకు కలిగె స్వేచ్ఛ చెలరేగుటకు!!

మార్చి 18. 2023

## 13. అస్పష్టం

మనసులో మెదిలిన ఆలోచనలు అస్పష్టంగా
నీడల్లా నీటిలో చిరుతరగల్లా కదుల్తూ సాగిపోతున్నాయి.
గురుతుపట్టి అభివర్ణించేలోపున
స్వరూపాలు మార్చేసుకుంటున్నాయి.
పావుగంటక్రితం చూసినదృశ్యం ఇప్పుడు లేదు.
వాటిని వివరించగల పదాలు కకావికలై చెదిరి పడిపోతున్నాయి.
వివరించేయత్నం విరమించి నాలో నేనే మురిసిపోతున్నాను,
000
మార్చి 6, 2023

## 14. నన్ను చదువుకుంటున్నాను.

జీవితం బడిపంతులమ్మ కాదు
జీవితం వల్లించదు కాపీపుస్తకంలోని సుభాషితాలు.
ఋషులూ తాత్వికులూ బోధించిన పరమసత్యాలు తలకెక్కించదు.
నేనిరుక్కున్న సంఘటనలు నేర్పుతున్నాయి అసలుపాఠాలు
నన్ను నేను చదువుకున్నాను.
అందుకే నేను నాకు మాత్రమే అర్థమవుతాను.

## 15. ఔన్నత్యం

మనిషి మనిషితో –
నాగురించి నీ ఆకూతి గోరంత
నా అస్తిత్వం మరి మేరుపర్వతమంత.
మేరుపర్వతం ఔన్నత్యం ఎరుగడు
సానువులలో నడయాడే మానవుడు.
వాడికి తెలియదు కదా ఆశిఖరపు ఔన్నత్యం
అక్కడికి చేరినవానికి తెలిసినంత ప్రస్ఫుటంగా.
00
(ఆకూతి – మనోగతభావం)
(మార్చి 4, 2019)

## 16. గంగాప్రవాహం

మగవాడిహృదయం గండ్రశిల
స్త్రీహృదయం గంగాప్రవాహం
మహోత్సాహంతో ప్రవహిస్తూ ప్రక్షాళన కావిస్తుంది
ఒరుసుకుపోతూ గరుకులు అరగదీసి, వంకలు తీరిచి
నునుపు తేర్చి ఒఆకారం రూపిస్తుంది.
000
(ఆగస్ట్ 16, 2019)

## 17. ఎవ్వతెవీవు?

యువతీ, ఎవ్వతెవీవు?
కాకలు తీరిన నిపుణులు తీరిచి దిద్దిన
నీశిరోజాలు, కనుబొమ్మలు
ముక్కూ, తోలూ,
దంతాలూ, వస్త్రాలూ,
కాళ్లూ, గోళ్లూ,
వెరసి ప్రతిభావంతుడు
చెక్కిన శిల్పంలా తీరేవు.
నీ పరిపూర్ణ మేకప్ అతివేలముమధ్య
నువ్వెవరో తెలీకుండా పోయేవు.
నీనిజస్వరూపం ఆనవాలు లేకుండా పోయింది.
ఎవరు నువ్వు?
చెప్పు తల్లీ, తెలుసుకుంటాను సరికొత్తగా,
000
(మార్చి 12, 2019)

## 18. కోరికలు

కుక్కపిల్లల్లా ముద్దులు గుడుస్తూ ఒడికెక్కుతాయి
రేచుకుక్కలయి గాట్లు పెట్టేక కానీ
తెలీదు ఎంత తెలివితక్కువపని చేసేమో.

## 19. నొప్పి

నొప్పి సాపేక్షం అవునో కాదో
1, 10మధ్య ఒక అంకెతో చెప్పమంటాడు వైద్యుడు.
నాకు తెలిసిన అంకెలు మూడూ, ఏడూ
మూడంకె వేసి ముడుచుకు పడుకునేలా చేస్తోంది.
ఏడంటే ఆరున్నొకటి అంటారు.
కొంచెం, ఫరవాలేదు, ఓ మోస్తరుగా ఉంది,
బాగానే ఉంది, చాలా నొప్పెడుతోందనగలను.
అలంకారవిశేషాలతో చెప్పాలంటే
రణరంగంలో కాళ్ళూ చేతులూ నరుక్కుపోయిన వీరుడిబాధ,
ముళ్ళకంపలో చేయి పెట్టినప్పుడు కలిగేనొప్పి అంటాను.
అంకెలలో అక్షరాలలో చెప్పలేను నొప్పి.
నొప్పి నొప్పే, చెప్పను సాధ్యం కాని నొప్పి.
000

## 20. దుఃఖం

నన్ను లోలోపలి చీకటిగుహలోకి లాక్కుపోతుంది
నాచూపుని గుండెలోతుల్లోకి మళ్ళిస్తుంది.
శ్రేయోభిలాషుల ఓదార్పుల్లా ఉక్కిరిబిక్కిరి చేస్తుంది
కుండపోతగా కురిస్తూ జడివానై, వెల్లువై
మూలమూలలా నక్కిన కల్మషాన్ని ప్రక్షాళిస్తుంది.
మబ్బు విడినఎండలా తేజోవంతమవుతుంది.
Phoenixలా కాలినబూడిదలోనించి ఉత్థానిస్తుంది.
విరిగిపడ్డ ఉత్తుంగతరంగంలా పైకి లేస్తుంది.
దుఃఖం మనోవికారాలను ప్రక్షాళిస్తుంది.

(ఆగస్ట్, 2021)

## 21. బతుకువిభవం

కొన్ని దశాబ్దాలు గడిచేక
జీవనసూత్రాలు మారిపోతాయి.
ఒంటికి మంచిది కాదంటూ తినకూడనివి ఉండవింక.
జిహ్వ కోరే రుచులే ప్రధానపాత్ర వహిస్తాయి.

కిటికీలూ తలుపులూ మూసుకుని నాలుగ్గోడలమధ్య
ఊపిరాడక, చల్లగాలికోసం బయటికి వెళ్తే
చెత్తబండీలు, leaf blowersతో దుమ్మురేపేపనివాళ్లు
నా పాదయాత్రలని రద్దు చేయలేరు.
నూనె మంచిది కాదు, నెయ్యి మంచిది కాదు
కాఫీ పైత్యం, కారం అజీర్తి, అరటికాయ కస,
వంకాయ కనరు, బెండకాయ జిగురు, కాకరకాయ చేదు
అంటూ పక్కన పెట్టేయడం జరగదు ఇకపై.

పొరుగూరిలో అడవులు తగలబడిపోయి
మాఊళ్లో air quality చెడి, దగ్గులూ తుమ్ములూ …
దగ్గుతూ, తుమ్ముతూనే తిరుగుతాను కానీ మానడం లేదు.
హంసలా ఆర్నెల్లు బతకాలన్న సూక్తి పదే పదే తల్చుకుంటాను.
నాలుగోపాదం అంత హాయి మరి లేదు.
నిజంగా బతుకు విభవం తెలిసేది అప్పుడేనేమో.
000

(అక్టోబరు 15, 2019)

# 22. వేరు పరితాపం



నువ్వు వేరు నేను వేరు అంటూ వేరు పెడతావు.
నేను పోసిన నారు నువ్వు అని తలచవు.
నాచేవతో నాలుగుదిశలా వ్యాపిస్తున్న నువ్వు
చిరుగాలికి సుగంధాలు వెదజల్లుతావు నేల నాలుగు చెరగులా.
నేను మాత్రం స్థిరోభవ వరదోభవ అనుకుంటూ
ఉన్నచోటనే ఉండి నిన్ను నిలబెట్టేనని గుర్తించవు.
నిన్ను నిన్నుగా నిలబెట్టడానికోసమే నాతపన అని చూడవు.

నేను లేని నువ్వు లేవు.
ఇంతకాలం అట్టడుగున కూరుకుపోయిన నేను
పౌరుషం పొడుచుకొచ్చి



స్తంభం చీల్చుకు వెలువడ్డ నారసింహుడిలా ధరణిపైకి ఎగసేను.



జిలిబిలి తిరిగే పసిపాపలా
జడలు జడలు అల్లుకుంటూ
అందమైన అడపిల్లలా
ఇదుగో వచ్చేస్తున్నా.
భయంలేదులే, నిన్ను ఆదుకుంటాను ఎప్పట్లాగే

"వేరు" ఆలోచనలు చేస్తూ
తిరుగుతున్నాను నేను
వేరూ వేరూ వెతుక్కుంటూ.
నేను వేరు అనుకుంటూ
కథ రాయడానికి కూర్చున్నాను.
అప్పుడే తెలిసింది ఈకథ ఎప్పుడో రాసేసేనని.
000

వేరు కథకి లింక్.

(అక్టోబరు 18, 2018)

## 23. జీవము గలవి

ప్రకృతము.*
పోజియ్యమంటే పూవు వినదు
ఇటు చూడంటే ఉడుత ఒప్పదు.
నేనిచ్చినపోజు తీసుకోమంటాయి.
కాదంటే పొమ్మంటాయి అవి.
లేకపోతే మళ్లీ రమ్మంటాయి.
అందుకే అవి ఇచ్చిన పోజులే తీసుకుంటాను.
ఆఫొటోలే ఆప్యాయంగా దాచుకుంటాను.
000

* ప్రకృతము అంటే చక్కగా చేయబడినది అని అర్థంట. ఈ ప్రకృతి అంతా తనకు తానే తీరిచి దిద్దుకునే అందగత్తె అయి భాసిస్తున్నదని నా తాత్పర్యం.

000

## 24. ఒక సురుచిర స్వప్నం

మసక వెలుగులో మండపం.
మండపంమధ్యన తను.
నరసంచారం లేదు, నరవాసన లేదు, నరుని జాడ లేదు.
అదొక పురాతన కట్టడం.
తూర్పున చీకటి గుయ్యారం.
లోపల సుప్రతిష్ఠితమైన శిలావిగ్రహం.
కన్ను పొడుచుకున్నా కానని గాఢాంధకారం.
తనని చుట్టుకుని పట్టువలువ గోముగా కప్పినట్టు నిశ్శబ్దం.
తలెత్తి చూసింది మళ్ళీ.
కనిపించనంత ఎత్తుకి దూసుకుపోతూ గోపురం
పావురాళ్ళే కాపురాలు పెట్టేయో
గుడ్లగూబలే నివసిస్తున్నాయో ...

… …
గదిలో చీకటి క్రమంగా విడుతోంది, చుట్టూ చూసింది.
అదే మంచం, అదే గది.
అదే కల. అదే ప్రశాంతం, ఎన్నిరాత్రులో ఇలా.
ఆ కలకి అర్థమేమిటో, సందేశం ఏమిటో అయోమయం.
ఆరాత్రి సుఖనిద్ర అనుభవం నిజం.

మళ్లీ కొన్నాళ్లకి మరో కల.
పెను గండ్రశిలమీద తను. అష్టదిక్కులా అపారపారావారం.
కనుచూపుమేర మిలమిల మెరుస్తూ తరంగాలు
ప్రళయం ఇదేనా?
మూడు నిలువులఎత్తుకి తరంగాలు మహోధృతితో లేచి
విరుచుకుపడుతున్నాయి.

అంతవేగంగానూ తనని దాటి దూసుకుపోతున్నాయి.
తనపాదాలమీదుగా జారి కింద బండరాతిమీంచి ఒరుసుకుపోతున్నాయి.
ఏ పుణ్యస్త్రీనో సమాదరిస్తూ నిండుమనసుతో పాదాలు కడుగుతున్నస్పృహ.
స్వచ్ఛమైన పావనగంగలో జలకమాడినప్పటి ఆహ్లాదం
పైన ఆకాశం గొడుగు పట్టినట్టు నిర్మల ప్రకాశం.
ఎక్కడ ఈహేల? ఇది ఏదేశం? ఎక్కడుంది తను?
పిట్టా పురుగూ, మనిషీ, మృగమూ ఏమీ లేవేమీ?
ఇల్లూ వాకిలీ చెట్టూ చేమా ఏవీ? భూమేదీ?
ఇదేనా ప్రళయం?
భయమో, బాధో, విచారమో, సంతోషమో ఏ స్పందనా లేదేమీ తనకి?
నేను నేనేనా?
కొన్ని రోజులు కనిపించి ఆగిపోయిన కల.

ఆ తరవాత నాలుగేళ్లకి కాబోలు మరో కల.
సాయంకాలం, చెదురుమదురుగా అక్కడా అక్కడా ఓ మనిషి.
మళ్లీ అవే ప్రశ్నలు, ఎక్కడుంది తను? ఇది ఏఊరు?
వీధివార ఏదో టీదుకాణం.
అరచొక్కా, అడ్డ పంచె, పట్టెనామాలు, చిన్నబొజ్జ. యజమాని కాబోలు.
ఓమూల ఊదుకుంటూ నెమ్మదిగా టీ చప్పరిస్తున్న చిరుగులచొక్కావాడు

తను కారులోనే ఉంది. ఇది తనకారే.
పక్కసీటులో వాడెవరు? తనకారులో ఎందుకున్నాడు?
తనెందుకు కారు తోలడం లేదు.
"ఇదుగో, అబ్బాయ్, ఈదారి ఎటు వెళ్తుంది?"
"అదేంటమ్మా? ఆదారి అటే వెళ్తుంది, మీరెటెళ్తే అటే వెళ్తుంది".
"అది కాదయ్యా, ఆవేపు ఏఊరుందని?"
"ఏయ్ ఇటెందుకు వెళ్లున్నావు? Amerillo ఇటు కాదు."
"ఇది దగ్గరదారి."
ఇతను తెలుగు మాటాడుతున్నాడేమిటి?

అసలతను నాకారెందుకు డ్రైవ్ చేస్తున్నాడు?
ఇక్కడికెలా వచ్చేను చెప్మా?
కూరలకోసం కదా బయల్దేరేను.
చీకటి పడుతున్నట్టుంది, తనసలెప్పుడూ ఈవేళ ఎక్కడికీ బయల్దేరదు.
ఎందుకు కారులో ఉంది? నారథం తోలుతున్నవాడెవరు?
దారి తప్పిపోయినట్టుంది.
సర్, సర్, Amarillo street అటువేపు.
ఈ లెక్కన ఇల్లు చేరేదెప్పుడో!
అసలు ఇల్లు చేరుతుందా?
… … …
కనురెప్పలు నిదానంగా విచ్చుకుంటున్నాయి.
"ఇది నాగదే. ఇది నామంచమే. ఆహా, ఇంట్లోనే ఉన్నాను."
తనెప్పుడూ తప్పిపోలేదు.
కలలో తప్పిపోవడం ఏమిటి?
అదే కల మళ్ళీ మళ్లీ
ఎన్ని రాత్రులో …
ఒకదాని తరవాత ఒకటి
మధ్యలో కలల్లేని నిద్ర
మళ్లీ కల
ఎన్ని రాత్రులో
మళ్లీ కొంత విరామం
ఎన్ని రాత్రులో
మళ్లీ మరో కల.

ఇది మూడో సారి.
ఏ రాత్రీ ఏకలలోనూ వెరుపు లేదు.
అబ్బురమైన ప్రశాంతత. బుద్ధి శూన్యం.
మనిషిజాడ లేదన్న చింత లేదు.
పరిసరాలగూర్చి చిన్న కుతూహలం కావచ్చు.
అంతే.
మూడుముక్కల్లో,
చింతన,
స్వాంతన,
పొంతన.

(మొదటికలలో చింతన, రెండొకలలో స్వాంతన, మూడో కలలో పొంతన అంటే మళ్లీ సమాజంలో కలిసిపోవడం అనుకోవచ్చు)
000

(అక్టోబరు 21, 2020)

## 25. సందేశం

కొన్ని వేలమందికి ఇచ్చిన సందేశం
కొన్నివందలమందిని ఒప్పించేనన్న సంతుష్టికన్నా
ఏ ఒక్కరినో నోప్పించేనన్న చింతే హెచ్చు సౌశీల్యానికి.

## 26. కావలెను ఛాలెంజి

గుమ్మం దిగితే ప్రమాదమని
బయటికి వెళ్లకమానము.
జులైలో వానలని తెలిసీ
వింబుల్డన్ జులైలోనె పెట్టుకుంటారు.
కిందటేడు కప్ నాదే కదా అని ఊరుకోడు క్రీడాకారుడు.
మళ్లీ రంగంలోకి దిగుతాడు.
చూసిచూసి కొట్టినబంతి గడిలో పడదు.
ఆట అంతటితో ఆగదు.
మళ్లీ గెలవనేమో అనుకుని ఊరుకొనడతను.

ఏమౌతుందోనని భయపడి ఆగిపోయినవారెవరూ
ఏమిగానీ సాధించిన దాఖలాలు లేవు చరిత్రలో.
పిరికివాడు మూలగదిలో ముడుచుకుపడుకుని
నిశ్శబ్దంగా, అనామకంగా నశిస్తాడు.
కళ్లు తెరుచుకుని గోతిలోకి దూకడమే ముందుకి నడిపించే శక్తి.
తనని తాను ఛాలెంజి చేసుకోడమే జీవసూత్రం.
000
7.4.2023

## 27. సంఘజీవి

సంఘమ్ శరణమ్ గచ్ఛామి
కుతర్కంతో
కువిమర్శలతో
కుళ్ళు భావాలతో
అసంబద్ధపు ప్రలాపాలతో
అర్థం పర్థం లేని వ్యాఖ్యానాలతో
వికటాట్టహాసాలతో
వినయపూర్వకం కాని అభ్యర్థనలతో
విసిగిపోతున్నవారి వేదనాలాపాలతో
విసిగించే వాచాలురతో
విరాట్ స్వరూపమై విజృంభించిన ఆ సంఘాన్నే ఆశ్రయించేను.
ఆ సంఘంలోనే నా ఉనికీ మనికీ.
ఆ సంఘమే నాకు రోజు వెళ్ళదీస్తున్నది.
ఆ సంఘమే నాకు ఉపశమనం.
ఆ సంఘమే నాకు శ్రీరామరక్ష!

(జులై 18, 2021)

# 28. హెచ్చుతగ్గులు లేనిదెక్కడ

పుట్టుకతో వచ్చిన
ఆడా మగా
పొట్టీ పొడుగూ
నలుపూ తెలుపూ
అందం చందం.

తావలచినది రంభ
తెలివివిలువ అధికం
శ్రమఫలితం నామమాత్రం.
చేసేవాడు చేయించుకునేవాడికి లోకువ
ఇష్టమైనటపా మూడు తెరపట్లకు సాగతీత
సామాన్యుడిటపా మూడు క్షణాల్లో హరించిపోత.

అది ఉత్తమకథ
ఇది సాధారణకథ
అతడు మహాకవి
ఇతడు ఫరవాలేదు, పాపం. ఏదో రాస్తున్నాడు.
ఆరాతకు ప్రథమబహుమతి
ఈరాతకు మంగళహారతి.

పోటీపని కథలలో తరతమభేదాల నిర్ణయం.
ఈ రచనపై శాస్త్రీయచర్చ
ఆ రచనపై కింవదంతులు.
చిరునవ్వు, కొంటెచూపు, జేజేలు, లవ్వూ, ముడిచిన భ్రూకుటి
స్పందనలలో హెచ్చుతగ్గులు 'వేలు'బొమ్మలాటలతో విదితం.
నిన్నటి నెంబర్ వన్ ఆటగాడు ఈరోజు మాయం
మరొక యువ ఆటగాడు ఆక్రమించె ఆ స్థానం.
అందరూ సమానులే అంటూనే ఉంటారు
ఎవరిఘనత వారు ప్రకటించుకుంటూనే ఉంటారు.

ఆయన భగవంతుడు
ఈయన పరమయోగి
ఆయన గౌరీపతి
ఈవిడ శివాని
సందర్భాన్నిబట్టి ఎవరోఒకరు కేంద్రబిందువు
హెచ్చుతగ్గులతీర్పులు ఒకరివి
వాటిని సమాదరించడం తదితరులవి.

సెప్టెంబరు 6, 2023

## 29. ఏనాటికీ తీర్చుకోలేని ఋణాలు

ఏనాటికీ తీర్చుకోలేని ఋణాలు
జన్మనిచ్చిన తల్లి
విద్యనిచ్చిన గురువు
భోజనం పెట్టిన గృహస్తు
ఉద్యోగమిచ్చిన అధికారి
అదేవరసలో అనుకుంటాను
రచనలను చదివి వాటిగుణగణాలను ప్రస్తావించిన
సాహిత్యాభిమానులు
రాజకీయరాతలు సాహిత్యం కాదని గమనించగల విదులు
టపాలో ప్రధానాంశం పట్టుకోగల చదువరులు అని.
ఇంకా,
కూరలబజారులో క్యూలో ముందుచోటు ఇచ్చిన పెద్దమనిషికి
Stop సైనూ రెడ్ లైటూ లేనిచోట కారాపి దారిచ్చిన డ్రైవరుకి
పిలచినవెంటనే పలికిన customer service repకి
చెప్పుకుంటాను కృతజ్ఞతలు.

(డిసెంబర్ 17, 2023)

## 30. స్వార్థం ఒక యోగం

ఇద్దరు వ్యక్తులు నాది నాది అంటూ కొట్టుకుంటే స్వార్థం
రెండు కూటాలు మాది మాది అంటూ
తన్నుకుంటే సామాజికన్యాయం.
కష్టజీవులకు అనుకూలచట్టాలు
భాగ్యవంతులపాలిట దుష్టచర్యలు.
తమకి అనుకూలించిన చట్టాలు హర్షదాయకం.
ప్రతికూలించితే పరమదుర్మార్గం.
దుష్టనాయకులంటూ వేరే లేరు
స్వార్థంతో నిర్ణయించేవారికి.
తమఆస్తి రక్షించని నాయకుడు అధికారమదాంధుడు.
పరిరక్షించినవాడు మహానాయకుడు.
000
(నవంబరు 10, 2020)

## 31. ఎన్వలపు!!

ప్రేమలేఖలు మోసుకురావాల్సిన ఎన్వలపులు మరణశిక్షలను తెస్తున్నాయి.

ఈరోగం కుదర్చగల ధన్వంతరి ఎక్కడున్నాడో తెలీదు.
ఆయనచిరునామా మారిపోయింది కాబోలు,
కావుకావుమంటూ వేడుకొన్న వినతిపత్రం తిరిగొచ్చేసింది.
ఇహ మిగిలింది నాఒటొక్కటే.
ఈరాచపుండుని సర్జరీ చేసి తొలగించగల వజ్రాయుధం
నా ఓటొక్కటే!!

(నోట్ – ఎన్ వలపు అంటే నావలపు అని గానీ envelope అని గానీ చెప్పుకోవచ్చు. గత రెండురోజులలోనూ అమెరికాలో పోస్టులద్వారా బాంబులు బట్వాడా చేస్తున్నవార్తలకి ప్రతిస్పందనగా ఈ రచన)
(అక్టోబరు 27, 2018)

## 32.  దంపుళ్ళపాట

అమ్మదినం వెల్లిపోనాది ఆహుం
సెల్లె ల్లదినం సొగసైపోనాది ఆహుం
దేశదేశాల ఆడోల్లదినం అదిరిపోనాది ఆహుం
అమ్మలగన్న అమ్మలదినము అట్టే పాయె ఆహుం

ఇగ రెన్నొల్లదనక మారాడకండిరో తంద్రులార
మీయమ్మ కడుపు సల్లగ ఆహుం
మీ పెద్ధలపున్యాలు పుచ్చంగ ఆహుం

పల్లకుంటేనూ పాయసాన్నాలు ఎడతం బాబులార
ఊరకుంటేనూ ఉపారాలు ఎడతాం తంద్రులార
మల్ల కల్లబడకుంటేనూ ఆహూం
మాజోలికి రాకుంటేను ఆహుం
మాఊసెత్తకుంటేనూ ఆహుం
మాబిడ్డలకు మీపేరెట్టుకుంటం మారాజులారా ఆహుం.

(మార్చి 10, 2020)

## 33. పక్కా ఆంధ్రుడు

పదహారణాల ఆంధ్రుడతడు
ఫ్రెంచి మీసకట్టు అరవ పంచెకట్టు
బెంగాలీ (గిరజాల)జుట్టు.
చేత సిగరెట్టు
నోట ఇంగ్లీషు పట్టు
పెసరట్టు మరి అతడి పడికట్టు.

## 34. అలలు అలలుగా కలలు

అది ఒక అసామాన్య కలకలం.
పుట్టినక్షణంనుంచీ గిట్టేదినమువరకూ ఒక ప్రయాణమైతే
ప్రతి స్టేషనులోనూ ఎక్కేజనం, దిగేజనం.
బతుకు సాగరమైతే
చేపట్టిన ప్రతి వ్యాపకం లేచి పడే అల.
గజమెత్తు లేచి విరిగిపడే ప్రతి అలా
మరో కలకి మార్గదర్శకం.
నాలుగు అలలు విరిగి పడ్డాక
ఐదో కలకోసం ఎదురుచూపు.
కౌతుకం నిన్నటినుండీ రేపటివరకూ చిటపటలాడే నిప్పురవ్వ
బతుకు నిరతాగ్ని హోత్రం.
000

(15 జూన్ 2019)

## 35. పండుగ వేడుకలు

ఏడాది పొడుగునా లేని కోలాహలం
మొదటా చివరా ప్రతిఏటా పండుగ.
అటు
గోడలకి సున్నాలు
గుమ్మాలకి తోరణాలు
వణికించే చలిలో
వాకిట తీరిచిదిద్దిన రంగవల్లులు
ఏడాదిపాటు పడ్డ శ్రమఫలం కనులముందు కుప్పయి
వెలసి మురిపించిన సౌభాగ్యం

ఇటు

నెట్టెక్కో కారెక్కో పరుగులు.
ఎవరికి ఏమి కావాలో
ఎవరికి ఏమి నచ్చుతుందో ఏది నచ్చదో
ఎక్కడ ఎంతలో ఏమి దొరుకుతుందో తహతహ
కొనడం, ఇవ్వడం, తిరిగిచ్చేయడం
మూడు స్థాయిల ముచ్చట.
సంక్రాంతి, Christmas ఏపేరు చెప్పుకున్నా
కనిపించేది ఎడతెగని ఉత్సాహం.
అహో ఎంత చెప్పినా తరగని ఆనందం.
000
(డిసెంబరు 21, 2018)

## 36. ప్రతీకాత్మకం

బ్రతుకంతా ప్రతీకాత్మకమే
ఒక వస్తువు బహుమతిగా ఇవ్వడం ప్రేమకి ప్రతీక.
వస్తువు ఘనపదార్థం. ప్రేమ రూపరహితం.
అరూపాన్ని ఒకరూపంద్వారా వ్యక్తం చేయడం
ఆఘనపదార్థాన్ని తిరగ్గొట్టడం ఆ అరూపాన్ని తిరస్కరించడం.
రెండూ ప్రతీకాత్మకమే.

# 37. వినోదం?

ఆనందంగా హుషారుగా జీవించాలన్నది ఈనాటిఆదర్శం,
ఏకైక ధర్మసూత్రం.
చదువు సరదాగా ఉండాలి.
ఇంటిపని వంటపని తేలిగ్గా హాయిగా అయిపోవాలి.
ఉద్యోగం సరదాగా ఉంటేనే అందం.
ఆనందంగా ఉంటేనే దానికి మర్యాద దక్కుడు.
చుట్టాలతో స్నేహితులతో ఇంటివారితో పొరుగువారితో
సంబంధాలన్నీ కిలకిలా గలగలా ఆడుతూ పాడుతూ
సాగిపోవాలి.

మాచుట్టుపట్ల ఊళ్లు తగలడుతున్నాయి.
వందమైళ్లవరకూ పొగవాసన తగులుతోంది
కొన్ని కోట్ల ఆస్తులు అగ్నికి ఆహుతి
ప్రాణనష్టం ఇప్పటికి 50
ఇంకా ఎన్ని ప్రాణులు పోవాలో మంటలార్పేలోపున.
ఈ మారణహోమానికి మూలం ఆనందం!!
“నాసంతోషం నాకు ముఖ్యం” అన్న వితండవాదం.

ఈ అగ్ని ప్రజ్వలించడానికి కారణం
campfire, సగం కాల్చి పారేసిన సిగరెట్లు
లేళ్ళవేటలో పేలిన తుపాకులు రాల్చిన నిప్పు రవ్వలు.

తమ **సరదాలకీ, వినోదాలకీ, జీవితాన్ని అనుభవించడానికీ ఇచ్చిన విలువ సామాజికబాధ్యతకి లేదు ఈ నవనాగరీక ప్రపంచంలో.**

అట్టే నిలబడి చూసేను.
సూర్యునిచుట్టూ గుడి కట్టినట్టు కనిపించిన
మట్టిరంగు పొగ చూపులకు బహు సుందరం.
ఫొటో తీయబోతే దిగులు.

000

(కాలిఫోర్నియాలో కొన్ని వందలమైళ్లు అడవులు మండిపోతున్నాయి మూడురోజులుగా)
గమనిక - ఇది కథలు అర్థం చేసుకోడానికి కూడా పనికొస్తుంది. అనేక సమయాల్లో మనప్రవర్తన మరొకభావాన్ని ప్రతీకాత్మకంగా వ్యక్తీకరించడమే కదా. నాకు మాత్రం కథ రాయాలనిపించలేదు. అంచేత ఇలా వెలువరించేను నాబాధ లేదా ప్రశ్న - వినోదంకంటె బాధ్యత ముఖ్యం అని నాఅభిప్రాయం.)
(నవంబరు 14, 2018)

## 38. నగరంలో కోలాహలం

నగరవీధులు శుభ్రం చేసి కళ్లాపు చల్లి
రంగవల్లులు తీర్చి దిద్దుతున్నారు.
పచ్చతోరణాలు కట్టేరు
పట్టు తివాసీలు పరిచేరు
పురస్త్రీలు కప్పురపునీరాజనాలు కుంకుమాక్షతలు సమకూర్చేరు
నవమోహనాంగి, జగన్మోహనాకారం
మేకప్పుల ఒప్పులకుప్ప
పడమటి యువరాణి వేంచేయుచున్నది
వేగిరపడుతూ రండు రండంటూ ఊరంతా కోలాహలం,
అయ్యో, ఎరుగరైతిరి భస్మాసురహస్తమని
పశ్చిమాద్రి వెలసిన వామనావతారమని.
కోహినూరు వజ్రానికి నీళ్లధార అప్పుడు.
మొత్తం దేశానికే ముప్పు ఈ పటాటోపం ఇప్పుడు.
అందుకే నా ఈ ప్రార్థన
దేవాదిదేవా! ఏ గుణపాఠం చెప్పడానికో ఈనాయకుని ప్రసాదించేవు.
ఇక నీవే గతి, కావు కావు కావమని నామొరలివే!
000

(Ivanka Trump ఇండియా వేంచేసిన సందర్భంలో చాలామందికి తెలీని లేదా అర్థం చేసుకోని సంగతి అది ఆ అమ్మాయి వ్యాపారలక్షణమని గ్రహించకపోవడం. ఆభావానికి ప్రతీకగా ఈటపా. నవంబరు 24, 2017)

## 39. ప్రవాసులపట్ల అమెరికా

ఆదిని ఉక్కుగొలుసులతో కట్టి లాక్కొచ్చేరు.
తరవాత అరచేత వైకుంఠం చూపి తీసుకొచ్చేరు
ఇప్పుడు దిక్కు తోచక జుత్తు పీక్కుంటున్నారు.
000

## 40. వాడేరా దైవము

ఒక మహా నాయకుడిని
ఒక మహా నటుడిని
ఒక మహా ప్రవక్తని
వాడేరా దైవము
అని ఆరాధించడంలో ఒక ప్రమాదం
ఆమనిషిలో లోపాలను క్షమించి
అతడివల్ల జరుగుతున్న మంచిని మాత్రమే చూడడం.
వాస్తవానికి, ఆమనిషి దుశ్చర్యలనే
అనుసరిస్తున్నారు చాలామంది.

ఇదీ జరుగుతున్న నాటకం వాడేరా దైవము అంటూ ఒక అమ్మనో అయ్యనో ఆరాధించడంలో.

000

అందుకే అంటాను
వాడు దైవమయితే నాస్తికురాలిని అని.

000

## 41. ఛిన్నాభిన్నం

భిన్నాభిప్రాయాలు ప్రోత్సహించాలని
ఏకాగ్రీవంగా నిర్ణయం చేసేరు మ.ఘు.వ. మేధావులు.
ఒకొక అభిప్రాయమూ ఒకొక ద్వీపమయి వెలసింది.
మొత్తం మానవులంతా ఒక అఖండసత్వం
అన్నభావానికి జీవం లేకుండా పోయింది.
000

(అక్టోబరు 8, 2018)

[మ.ఘు.వ. - మహా ఘనత వహించిన, గౌరవవాచకం]

## 42. ప్రజాస్వామ్య సర్కస్

నీతీ, నిజాయితీ, స్వలాభాలూ,
ఒకొకరి ఔన్నత్యాలూ, త్యాగాలూ
కుప్పగా కూలిపోయి ఏది ఏదో తెలీక
మనసు మొద్దు బారిపోయినప్పుడు
రాయిరప్పల్లో కనిపించని అరూపాలను వెతుక్కుంటూ
క్షణం తరవాత క్షణం గడుపుతున్నాను.
000

(జనవరి 2, 2019)

## 43. ఓట్లపండుగ

ఓటు ఓటుకీ కోటి దండాలు
ఓటుమాలచ్చిమికి శతకోటి దండాలు.
వెలిగించవమ్మా దీపాలు
నేతలకపోలాలు మట్టిప్రమిదలు కాగ.
కూటికోసం గూటికోసం వేడుకుంటున్నాను
కాలూ చేయీ ఆగకుండా ఆడడంకోసం
ఓటేసి నిలబెట్టు నాబోటి జనులఉసురు.
కోటిదండాలు పెట్టుకుంటా నీపేరు చెప్పుకు.
000

## 44. అమ్రికా టుర్మెరికా

అమెరికాలో పసుపుగుణాలకి నీరాజనం.

డాక్టరుమహాశయులు పసుపుగుణాలు
పావుగంట పాఠం చెప్పి రాసిచ్చినచీటీ
మందులదుకాణంలో అంతకంత పసుపు గుణగణగానం.
వాటికి తగ్గ అమెరికన్ ఖరీదు.
హన్నా, మనవస్తువు సుందరసీసాలో పోసి
మనకే అంటగట్టుట అమెరికనిజం కదా.

ఇంటికొచ్చి వీళ్లకి నేనే అమ్మగలసరుకుకోసం
తీవ్ర పరిశోధనకి పూనుకుంటే మరిన్నివివరాలు.
ఆవుపేడనించి గోగాకువరకూ
   అమెరికన్నైజు గాని ఇండియనువస్తువు లేదు.
ఆంధ్రాలో వందకి దొరికే ఆకులు అమ్రికాలో పాతికడాలర్లు.
అది కారుచవుక అంటూ ఉపశమనవాక్యాలు.
విమానఖర్చు మనది కాదనుకుంటే
ఆంధ్రాకి ప్రయాణమే మేలు గదా.

[మనపసుపు, మన యోగవిద్య అన్నీ మనవే మనకి నేర్పుతున్నారు. పసుపే టుర్మరికు. యోగాసనాలే యోగా. మనం ఖర్మ అనడం మానేసి కర్మా అనడం ఇందుకే మరి.}

## 45. అప్పిచ్చువాడు

అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడతెగక పారు నేరును, ద్విజుడున్
జొప్పడిన, యూరనుండుము
చొప్పడకున్నట్టి యూర జొరకుము సుమతీ.

అని బద్దెనగారు శలవిచ్చి శతాబ్దాలు గడిచేయి.
ఇప్పుడవి చొప్పడునో చొప్పడవో అను శంక లేదు.

ఇచట అప్పు పుట్టుట అతితేలిక
పుచ్చుకో పుచ్చుకోమంటూ
వెంటబడి కార్డురూపంలో అప్పులిచ్చేస్తారు.
ఛార్జి మొత్తం వెంటనే ఇవ్వక్కర్లేదని ఊరడిస్తారు..
1,3 శాతం సొమ్ము నీకిస్తామని ఆశ పెడతారు.

సమయానికి అప్పు మొత్తం తీర్చకున్న
మీద పడగల ఇంటరెస్టుయందు ఇంటరెస్టు కలుగదెవరికీ.
ఉచితమే కదా అని పుచ్చుకుంటారు జనం.
నగదురూపంలో అచ్చుకున్ననాటి నొప్పి తగలదు
కార్డుముక్క అలావోకగా అందించినప్పుడు.
కార్డు తరవాత కార్డు కుప్పలు పోసుకున్నాక
కారో ఇల్లో కొన్నప్పుడు తెలుస్తుంది వాటిబలం.
వాడకపోయినా క్రెడిట్ రిపోర్టులో ప్రత్యక్షమయి.
అప్పులకే ఇంత తతంగం.
కొళాయినించి నీరు పారుతూంటుంది ఎడతెగకనే.
వైద్యునిమాట మాత్రం అడక్కండి.

మరియు, కాలం మారిపోయింది కనక ద్విజప్రసక్తి లేదు.

## 46. మంచివాడి మరణం

పుణ్యపురుషునిచావు పెళ్ళితో సమానం.
కొందరు బతికుండగా ఎన్నో ఘనకార్యాలు చేస్తారు.
కొందరు చనినా మనతోనే ఉంటారు.
John McCain బతికున్నప్పుడూ చనిపోయేకా
దేశసేవ కొనసాగిస్తున్న పుణ్యపురుషుడు.
ఒక నీతికీ నియమానికీ కట్టుబడినవాడు
పార్టీకంటె దేశసౌభాగ్యం ప్రధానమని చాటినవాడు.
తనతప్పులనూ ఎదటివారి తప్పులనూ
ఏకసూత్రంతో ఎత్తిచూపగలవాడు.
ఉపనాయకులలో ఏమూలో అణగారిపోయిన అంతరాత్మని తట్టి లేపి,
ఇసుమంత చలనం కలిగించగలిగిన మేధావి.
మనదేశంలో ప్రాణత్యాగం చేసిన మహావీరులకోవ.
ప్రస్తుతం  post-మరణ నాటకం మంచి పాఠం.
000

[John McCaine ఎవరో తెలీనివారికి చిన్న నోట్ -
సూక్ష్మంగా, ఆయన వియత్నాం యుద్ధంలో పాల్గొని, శత్రువులకి చేజిక్కి, అనేక క్రూరహింసలు అనుభవించి, తిరిగివచ్చినవాడు. రిపబ్లకన్.
ఇటీవలిరాజకీయాలలో ఈయనఔన్నత్యం మరింత ప్రస్ఫుటమవడంచేత మరోసారి స్మరించుకుంటున్నాను. ఇతర వివరాలు కావలసినవారు అంతర్జాలంలో చూడవచ్చు. నాలో మాత్రం ఎన్నో ఆలోచనలు రేపింది John McCain అస్తమయం.]
000

(ఆగస్టు 28, 2018)

## 47. అజరామరం

చిన్నారీ, గుర్తుందా?
నీకు ఎనిమిదేళ్లప్పుడు
“పని నేర్చుకో, నేనెల్లకాలం ఉంటానా,” అంటే
“అవునుంటావు. నీకు మరణం లేదు” అన్నావు.
చిన్నగా నవ్వుకున్నాను.

పదహారేళ్ళప్పుడు
“కుట్లు నేర్చుకో, ఊడిన బొత్తామైనా కుట్టుకోడం రావాలి” అంటే,
“బొత్తాయి కుట్టేవాడినే పెళ్లి చేసుకుంటాను,” అన్నావు.
నవ్వొచ్చింది నీతలపోతలకి.

నాలుగు దశాబ్దాల అనంతరం,
“నువ్వు అజరామరం కావాలి. అలా జరగదు. నువ్వున్నంతకాలం
చూసుకుంటాను నిన్ను” అంటావు..

చిట్టితల్లీ, నామటుకు నాకు
అజరామరమై ఉన్నట్టే ఉంది.
నాబోగీ మూడు స్టేషన్లు దాటిపోయినా
మొదటి స్టేషనులోనే తిరగాడుతున్నాయి మనసూ మెదడూ.
నీ తీరుతెన్నులు నాకు బ్రహ్మపదార్థం.
నీభాషా భావాలూ లీలగానైనా అర్థం కావు నాబుద్ధికి.
నీలోకం నాకు పెరలోకం.
నాలోకంలో నాగూటిలో నేను
అజరామరమైన అక్షరమై అక్షరజీవినై
చెలగగలను నీ చేతనావస్థలో!!
000

(ఆగస్ట్ 13, 2020)

# 48. అనుమాననివృత్తి

ఎన్నో ఏళ్ళగా ఈదారిని నడుస్తూనే ఉన్నా
ఎందుకో నిన్ననే నాకంటికానింది.
క్షణకాలం ఆగి పరీక్షగా చూడాలనిపించింది.
ఆ చెట్టునీడ కూర్చోవాలనిపించింది అకారణంగానే.

ఈ పేరు తెలీని తరువు నాకు
బోధివృక్షం కాగలదేమో అనుకుంటూ …
చేతిలో ఫోనువంక చూసేను.

మిరుమిట్లు గొలిపే వెలుగుతో
నారేపురేఖలు రేఖామాత్రంగా కనిపించేయి..

నామస్తిష్కంలో శూన్యం పరుచుకుంది.
అనుమానం నివృత్తి అయిపోయింది.
ఏ చెట్టయినా బోధివృక్షమే!!

(సెప్టెంబరు 6, 2019)

## 49. అనుమానాలు!

మెట్లెక్కుతుంటే ఆయాసం వచ్చింది.
 ఉబ్బసం కాబోలు
పులిహోరకోసం ఎదురుగా పెట్టుకున్న కరివేపాకురెబ్బలు
 పోపులో వేయడం మరిచిపోయేను, Alzheimer's కాదు కద?
అన్నం తింటుంటే దగ్గొచ్చింది
 క్షయేమో, ఖర్మ
సూదిలో దారం ఎక్కించబోతే చెయ్యి వణికింది
 Parkinsons?
అయ్యో, ఇదేమిటి చేతిమీద
 మచ్చలు? ఇదేనా బొల్లి?

అనుక్షణం అనుమానాలు.
వైద్యునిసంప్రదిస్తే,
ఆయన నావేపు తీక్ష్ణంగా చూసి,
ఓ చీటీమీద రెండు ముక్కలు గిలికి నాచేత పెట్టేడు.
"మందులకంపెనీప్రకటనలు నీ బుర్ర తినేసేయి.
ఆర్నెల్లపాటు టీవీ చూడకు," అని ఉంది అందులో.
ఇది కుదిరేరోగం కాదని తేలిపోయింది.
000

నాఆలోచన – అసలు నేను ప్రకటనలు చూసి వస్తువు కొనను. ఆ ప్రకటనలకి చాలా ఖర్చు అవుతుంది. అఖర్చంతా మనం ఇచ్చుకునే ధరలో పరోక్షంగా ఉంటుంది. అంటే డబ్బిచ్చి తద్దినం కొనుక్కోడం అన్నమాట.

కానీ, టీవీలో వచ్చే ఈ ప్రకటనలు మనం ఆపలేం. అదీ నాబాధ. వైద్యశిఖామణి మాటే శిరోధార్యము.

(నవంబరు 24, 2018)

## 50. చాలవా ఇవి మాకు?

మానినీ, మదిరా, కవితా
కావాలి కొందరికి.

నాకు చాలు
గగనతలానికి రిక్కించిన భూరుహాలు
వాటిమీదికి ఎగబాకిన లతలు
చిలుకలకిలకిలలు
సెలయేరుగలగలలు
చిరుచేపలతపతపలు
అరవిరిసిన అడవిపూలు
ఉడుతలు, కుందేళ్ళు.
ఇవి చాలు నాకు.
తదితరహంగులన్నీ ఆటంకాలే
అడవిసౌందర్యం అనుభూతించడానికి.

(జనవరి 1, 2019)

## 51. నిర్మమ

ఆ వాకిలి నాది కాదు
ఆ మాలిని నేను కాను
ఆ సుమశోభలు నారచనాచమత్కృతి కాదు.
అయినా అనుకుంటాను
పుష్పం సమర్పయామి అని.

(నా నిత్యసంచారంలో సేకరించిన పూవులచిత్రాలగురించి నేను అనుకున్నమాట)

(మే 8, 2019)

## 52. చిన్నినా'జ్ఞ'కు శ్రీరామరక్ష!

నన్ను నేను కాపాడుకుంటున్నాను
శ్రేయోభిలాషుల (అన్)ఉచితసలహాలనించి
అర్ధరహితసానుభూతి వరదనించి
మూసకట్టుభావాలకుండపోతలనుండి
నోటిమాటకి పొసగని నుదుటి హాసరేఖలనించి
నన్ను నేను కాపాడుకుంటున్నాను.

వాదాలే వేదాలై తమభావాలే బ్రహ్మసత్యాలు కాగ
తమ ఇష్టానుసారం ముద్రలు వేసే వాదవిదులనుంచి
ప్రధానాంశము వదిలేసి అక్షరదోషాలను ఎంచే
మూషికమార్జాల గురువరులధాటినుంచి
నన్ను నేను కాపాడుకుంటున్నాను.
చిన్నదానికి పెద్దపీట వేసి, సప్తవిధ** అతిశయోక్తులతో
అందలాలెక్కించే సాహితీప్రక్రియనుంచి
వినయమును అజ్ఞత అనుకునేవారి హెచ్చరికలనించి
నన్ను నేను కాపాడుకుంటున్నాను.
ఉద్ధరేదాత్మనాత్మానం ఆత్మానమవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవరిపురాత్మనః
అని నాకు నేను చెప్పుకుంటూ,
నాబంధువును నేనై నన్ను నేను కాపాడుకుంటున్నాను.

(ఆగస్ట్ 14, 2023)

[** సప్తవిధ అతిశయోక్తులు - సంబంధ, అసంబంధ, అక్రమ, చపల, అపహ్నవ, అభేద, భేదకాదిభేదములు : చూ, అలంకారము.3. - ఆంధ్రభారతి]

## 53. అకారణం

చీకటిలో తడుముకుంటూ తిరుగుతాను
దీపం వెలిగించుకోవచ్చు కదా అంటే చెప్పలేను.
అర్థాలకోసం నాబుర్రలో వెతుక్కుంటాను.
అడగరాదా, నిఘంటువు చూడరాదా అంటే చెప్పలేను.
మొండితనమో, మూర్ఖత్వమో
మరేదో దానికదే నన్ను నడిపిస్తుంది,
నాకు సంతృప్తినిస్తుంది.
బలాన్నీ శౌర్యాన్నీ ప్రసాదిస్తుంది
000
(సెప్టంబరు 29, 2019)

## 54. ఇది నా అరణ్యం

పూర్వం మునులు అరణ్యాలకు వెళ్లేరు
నిత్యజీవితంలోని ఝంఝాటాలు తెంచుకు.
అంతరాయాలు లేకుండా ధ్యాననిమగ్నులు కావడానికి.
ఇంట్లో సాధ్యం కాదు కనకనే అరణ్యాలను ఆశ్రయించేరప్పుడు.

శ్రేయోభిలాషులూ సుహృన్మిత్రులూ చుట్టాలూ పక్కాలూ చేసే
రణగొణధ్వనులతో ధ్యానానికి అవాంతరం కలిగిస్తారని కాదు
గతంలో చేసిన పాపకార్యాలు ప్రస్తావించి తలనొప్పి కలిగిస్తారు.
మరుద్దామన్నా మరిచిపోనివ్వరు.
పాపం, ఆ మానవుడు ఎంత చెవులూ కళ్ళూ మూసుకుని
ధ్యానముద్ర పట్టినా, పనిగట్టుకు కెలికి కెలికి
గతం గుర్తుకి తెస్తారు సానుభూతి నెపంతో.

## 55. విపర్యయము

జీవితంలో దీర్ఘకాలికప్రణాళికలు లేవు.
వేసుకున్న ప్లానులన్నీ ఏపూటకాపూటే ముగుస్తాయి
సమాజంతో తెగతెంపులు చేసుకోవాలనుకున్న నిర్ణయం
ఒక్కరోజు అనుభవంతో హతం.
ఏ బలహీనక్షణంలో ఇంటికి రానిచ్చిన ఘన స్త్రీవాది
నిజస్వరూపం ఆవిష్కరిస్తుంది.
నాఆస్తీ అంతస్తులఅంచనాలతో తన ఐశ్వర్యప్రదర్శనతో.

నాకు మర్నాడు మరో ప్రణాళిక మొదలవుతుంది.
సమాజం నడిబొడ్డున వెలియునికి
సూర్యాస్తమానంతో సమాప్తం.
నిజానికి నాదీర్ఘకాలికప్రణాళికలన్నీ ఒకరోజుతో ముగిసే
కార్యక్రమాలే.
000

[వెలియునికి - ఊరికి వెలుపల
విపర్యయము పదానికి నిఘంటువు వివరణ.
*తారుమారు : తెలుగు పర్యాయపద నిఘంటువు (జి.యన్.రెడ్డి) 1990*
అక(ట)(టా)వికటము, అడ్డదిడ్డము, అడ్డాదిడ్డి, అస్తవ్యస్తము, ఎటమడు(గు)(వు), క(క)(కా)పిక, కక్కరిబిక్కరి, గందరగోళము, గడబిడ, చిందరవందర, తడబాటు, తబ్బిబ్బు, తికమక, తిబిరి, మారుపాటు, విట(త)(తా)టము, విటతాటనము, **విపర్యయము**, విపర్యాసము, వీటతాటము, వీడుపాటు, వ్యత్యస్తము.]
(జనవరి 29, 2023)
000

## 56. నేను నేనెలా అయేనంటే

నేను నీలా అనుకోను కనక
నాకు మరణం అమంగళం కాదు కనక
నాకు నిరీహ సాధారణమనోవికలం అని తెలుసు కనక
నేనెక్కడుంటే అదే నాచోటు అనుకోగలను కనక
నాకు మెప్పులు కాదు, విషయవిస్తరణే ముఖ్యం కనక

నీమాటలో నేను కొత్తగా తెలుసుకోగలది ఏమిటో చూస్తాను.
నీకు నేను చెప్పగలను అంటూ అహంకరించను.
నాతెలుగు ఆలోచనలకి దన్నుగా ఆంగ్లపండితులని
అరువు తెచ్చుకోను.

నేను నేనుగా విడిగా నిలబడిపోయేను.
నాబలం నాలో నాకు నమ్మకం.
నన్ను నేను గౌరవించుకోడం నాస్వభావం.

(ఆగస్ట్ 14, 2023)

## 57. అంతర్జాలమంటే

ఊహాలను రేకెత్తించే ఒకే ఒక సాధనం
నానావిధప్రసూనాల సువాసనలు
నోరూరించే వంటకాలు
పారే సెలయేరుహోరులు
నక్షత్రాల మిలమిలలు
నిశాచరుని వెన్నెలవెలుగులు
మార్తాండుని వేడిమిపోకడలు
నీలితెరమీద కనులకి ఉత్తుత్తి విందులు
ఊహలలో అనుభవించమంటూ.
మెదళ్లను పదును పెట్టు ఈ సానరాయి
నవ్యాధునికసృష్టి
అపరవిశ్వామిత్రుడు సాంకేతికనిపుణుడు.
000
(సెప్టంబరు 29, 2019)

## 58. భ్రమ

అంతర్జాలంలో మనలగురించిన భ్రమలు సృష్టించడం ఎంతో సులభం.
ఒక పుస్తకం ప్రస్తావిస్తే చాలు అబ్బ పుస్తకాలగురించి ఎంత తెలుసో
అనిపించడానికి
ఒక రచయితగురించి రాస్తే గొప్ప విమర్శకురాలు
ఒకకథ తమకి నచ్చితే, ఆహొా మహా రచయిత్రి
కవిత అనిపించుకోగల నాలుగు వాక్యాలు రాస్తే కవయిత్రి
ఒక మంచి ఫొటో పోస్టు చేస్తే గొప్ప ఫొటోగ్రాఫరు
ఆ తరవాత
అనేకులు ఆ ఒక్కఫొస్టుకి పొంగిపోయి, రిక్వెస్టులు* పంపుతారు.
మనప్రతిభ నేల నాలుగు చెరగులా పాకిపోతుంది.

000

[* ముఖపుస్తకంలో]

## 59. జాలజ్ఞాన తత్వములు

1. రాసినది పోస్టు చేయకుండా నిగ్రహించుకోగలవాడు
పోస్టు చూసీచూడకమున్నే వ్యాఖ్య రాయాలన్న కుతిని
ఆట్టుకోగలవాడు
వ్యాఖ్యలు చూచి చలించనివాడు
ఖాతా deactivate చేసి తిరిగి చూడనివాడు
ఖాతా ఖరాఖండీగా మూసివేయగలవాడు
పొసగనిచోట పొరలివచ్చు ఆంగ్లపదాలను ఆచిపట్టి
ఆపుకొనగలవాడు.

2. మంది ఎక్కువయితే మజ్జిగ పల్చబడినట్టే,
టపాలు ఎక్కువయితే (ఒక్కరివి) వేలిముద్రలు, వ్యాఖ్యానాలు
పల్చబడతాయి

3. ఒకరోజు కొత్తటపాలు ఆపితే
వెనకటి టపాలకు విముక్తి
మిస్సయినవారికి వెసులుబాటు

4. ప్రతి టపావెనక మరో టపాకాయ ఉంటుంది
అదేదో తెలిసినవారు వ్యాఖ్యానిస్తారు.
తెలీనివారు వేలిముద్ర వేస్తారు.
తదితరులు మౌనంగా తప్పుకుంటారు

5. టపా పోస్టు చేసి అప్పిస్తాం
వేలిముద్ర వేసి అప్పు తీర్చుకుంటాం

6. అంతర్జాలములో మైత్రి అతి సులభము
"ఫ్రెండు"ల రాకపోకలు నిత్యనైమిత్తికాలు.

7. accept, unfriend, block, report విద్య సాధించినవారికి బ్రహ్మపదము సిద్ధించినఫలము.

8. ఒకపూట ముఖపుస్తకముచూడడం మానేస్తే ఎన్నో పనులు ఎంతో శ్రద్ధగా చేసుకోగలం.

## 60. జాలవారిధిలో చిరుద్వీపం

నాకు నేను సృష్టించుకున్న ద్వీపం
నాకు నేను కట్టుకున్న అదృశ్యహవేలీ
ఆదానప్రదాల కార్యక్రమం లేని వేదిక.
ఇక్కడ పూవులు రారమ్మని భ్రమరాలను పిలువవు
కొరుక్కుతినమంటూ జాంపండు చిలుకను ఆహ్వానించదు.
నాకిష్టమైనది ఆస్వాదించడం నా ఆదర్శం.
ఇష్టమైనవి గైకొనమని నీకు నా సలహా.

000

నాకు ఎవరిమాటలూ వినిపించవు
ఎవరు ప్రదర్శించే చిత్రాలూ కనిపించవు.
కాదూ కూడదని మారాంచేస్తే
delete, ignore, block, unfollow, unfriend
నాకు యఫ్బీ ప్రసాదించిన వరాలు.
బాగున్నావా? అని వారు అడిగితే
ఎవరండీ మీరు అని నాకు వినిపిస్తుంది.
ఇదీ నీబతుకు అంటూ వారు ఆవిష్కరించి చిత్రరాజం
నాకు శూన్యంగా కనిపిస్తుంది అంతరిక్షంలా.
అంచేత అట్టే శ్రమ పడకు
నేను క్షేమం. నువ్వు క్షేమమనుకుంటానంటూ
శలవు తీసుకుంటాను ఎప్పటికప్పుడు.

000

(జనవరి 25, 2018)

## 61. జాలపంచాగము

జాలవారం ఉదయం ఆరునుండి తొమ్మిదివరకూ విశేషచూపులు
సాయంత్రము సాధారణము, వ్యాఖ్యలు అంతంతమాత్రము
పశ్చిమదిక్కున బెలూనులు ప్రేలును
తూర్పున వాగేశ్వరులకు* రాజభోగము
ఉత్తరదిశ వరదలు, దక్షిణదిశ భూకంపము
సాహితీక్షేత్రమున ప్రేమలేఖలు సుభిక్షమై చెల్లు.
అనామకులకూ, అధములకూ పూజలు పుష్కలము.
క్రియ శూన్యము.
సాధుమతులకు నామమాత్రము.
సాంకేతికవిద్య విజృంభించి చరిత్ర తిరగరాయును
చిత్రములు, సొంజ్ఞలతో సంభాషణలు సాగును
కృత్రిమరాసివారికి రాజపూజ్యము తొమ్మిది, అవమానము నాస్తి.
మాటకారులకు బృహస్పతి ఉచ్ఛదశలో ఉన్నాడు,
సౌజన్యమూర్తులకు శనియోగము
తదితరులకు సందిగ్ధము.
సర్వే జనాః సుఖినో భవంతు.

000

**వాగేశ్వరులు – బడబడ వాగేవారు.

గమనిక – కేవలం కాలక్షేపంరచన. అర్థరహితం. ఎవరినీ హేళన చేసేఉద్దేశం లేదు.
ఫిబ్రవరి 13, 2023

## 62. నారాత మారిపోయింది

సాంకేతికం వచ్చి నారాత మార్చేసింది.
పూర్వం కథ ఆసాంతం ఆలోచించుకుని కాగితమ్మీద కలం పెట్టేను.
ఒక్కొక్క అక్షరం పట్టి చూసుకుంటూ రాసేనే కానీ
మీటమీద మీట నొక్కి అయిపోయిందనిపించుకోలేదు.
ఒత్తులూ, దీర్ఘాలూ, కొమ్ములూ, వట్రుసుడులూ
శ్రద్ధగా చూసుకుంటూ రాసేను.
ఎప్పుడో తప్ప తప్పులు లేకుండానే రాసేను.
తుడుపులూ, కొట్టివేతలూ లేకుండానే సాగింది నారచన.
ఇప్పుడు తొచింది తోచినట్టు, రెప్పపాటు జాప్యం లేకనే
కీలమీద కీలు కొట్టి పూర్తి చేసేస్తున్నాను.
ఒకే sittingలో పూర్తి కావడం లేదిప్పుడు.
మొదలూ, తుదీ, ఆదీ ఆంతమూ రాసేసి, మద్యలో పేరాలూ ఇరికిస్తూ
ఎప్పుడు ఏది తోస్తే అది నీలితెరమీదికి ఎక్కించేస్తున్నాను.
ఆమీదట వాక్యాలు, పేరాలూ ముందుకీ వెనక్కీ జరుపుతూ
ముగిస్తున్నాను.

దృష్టిదోషంచేత, చేతివేళ్లతొందరపాటువల్ల కీబోర్డుదోషంమూలాన,
మరియు కీబోర్డు లేఅవుటు అర్థంకాక… ఎన్నో కారణాలు
అచ్చుతప్పులూ హల్లుతప్పులూ సాధారణం అయిపోయేయి.
కొందరు అర్థం చేసుకుని ఊరుకుంటారు
కొందరు పట్టించుకోరు
ఇది గ్రహించేక, కొంత నిర్లక్ష్యం కూడా అలవాటయింది.
సాంకేతికం వచ్చేక,
కాయితంమీద కలం పెట్టి రాస్తున్నప్పటి శ్రద్ధ మారిపోయింది.
కీబోర్డుమీద రాత భుజబల ప్రదర్శన అయిపోయింది.

(ఏప్రిల్ 17, 2019)

## 63. సరదాలు ముదిరి

సరదాకి సావాసగాళ్ళతో
ఫొటోలు పంచుకోడానికి మొదలయింది.
ముసిముసినవ్వులతో విస్తరించింది.
మరింతమంది పోగయేరు
పదులలో, వందలలో, వేలలో, లక్షలలో.
సరదా మారి వ్యాపారమయింది.

బొమ్మలాట దాటి, ఊరూ పేరూ, ఆనవాళ్లూ
ఆశయాలూ, ఆలోచనలూ ఇతరవ్యాపకాలూ
పంచుకునే స్థాయికి చేరేయి.
దేశదేశాలకి పాకింది అంటువ్యాధిలా.
తొండ ముదిరి ఊసరవెల్లయింది.
జక్రనామధారి* కోటికి పడగలెత్తేడు.
అమాయకులు మాత్రం ఉచితవేదిక అంటూ
మురిసిపోతున్నారు.

000

[Zuckerberg అనుపేరుగల ప్రముఖుడు సరదాగా ఫొటోలు పంచుకోడానికి మొదలుపెట్టిన వేదిక ఫేసుబుక్. అతని ప్రస్తుత ఆస్తి వంద బిలియనులని అంచనా. ఈలెక్కలో చాలా తికమకలున్నాయి కానీ అతని సంపాదన Facebook విజయంతోనే ప్రారంభమయింది.]

(ఏప్రిల్ 11, 2018)

## 64. నీడతో యుద్ధం

అంతర్జాలంలో ప్రవేశించిన అనంతరం
ఆలస్యంగా తెలుసుకనే విషయం
అంతర్జాలంలో అక్కడ మనుగడ నీడతో యుద్ధం.

ఎవరు ఎప్పుడు ఏమంటారో తెలీదు.
ఒకటపామీద ఏ వ్యాఖ్యలు వస్తాయో తెలీదు.
మారుపేర్లు, కుహనా ఐడీలు, గూగుల్ పాండిత్యం,
అహంకారంతో ఇష్టానుసారం చేసే చేర్పులు,* తీర్పులు,
కాదంటే ఋజువు చూపమని సవాలు
అంతర్జాలంలో ఉచ్ఛ్వాసనిశ్వాసాలు.
నేల విడిచి సాము, నీడతో యుద్ధం.

(* వికిపిడియావంటి ప్రతిష్ఠాత్మకవనరులలో సైతం చూడొచ్చు ఈవ్యవహారం. కథానిలయంలో నాకు తెలిసి కొందరు రచయిత్రుల జన్మస్థానం అదిలాబాదు అని ఉంది. ఆ సమాచారం తప్పు అని చెప్పినా వారు మార్చలేదు.

(* Wikipediaలో "నిడదవోలు మాలతి" పేజీలో మునిపల్లె రాజు అని నేను రాస్తే, ఒకమేధావి మునిపల్లె పదాన్ని మునిసిపల్లె అని మార్చేరు. తెలుగు తెలిసినవారికి ఎవరికైనా మునిసిపల్లె అనే పదము లేదని తెలిసే ఉంటుంది. ఆ మేధావి మునిసిపల్ అన్నపదం తప్పుగా అర్థం చేసుకున్నాడనుకుంటాను.)

## 65. సోది

సోది సెపుతానమ్మ సోది సెపుతా!
నీబతుకేటో సెపుతా
నీఊరేదో సెపుత
ఏ పుటోలు ఏడ తీస్తివో సెపుత
ఏమి తింటివో
ఏడ ఏమి కొంటివో సెపుత
నీఆనుపానులు సమస్తం సెపుత
నీగుట్టుమట్టులు సక్కంగ వివరిస్త
నీకెవ్వురెవ్వురు ఎరికో
ఏ మందల కలిస్తె నీకేటి ఒరుగుతాదో
సొది సెపుత,
నీవు పుట్టినదినాలు రెండొ మూడొ ఇట్టె సెపుత
నీబుక్తి యుక్తులు సక్కంగ ఇడమరిసి పలుకుత
సోది సెపుతానమ్మ సోది సెపుత.

బాగుందమ్మా, నీసోది. అవుతే మరి ఓ సోదెమ్మా,
ఇంకా నా స్నేహితుల బంధువులమాట చెప్పవైతివి. అన్నదమ్ములు, ఆలుమగలు, అక్కసెల్లెళ్లు, వదినామరదళ్లు, తల్లిబిడ్డలు ఆనవాలు గట్టవైతివేమి? అని నేను ప్రశ్నించగా,
సోదెమ్మ ఇట్లు వాక్రుచ్చెను, ఓ యమ్మ, ఎవ్వురు ఎవ్వురికేమైన నాకేమి ఒరిగేను, నీకేమి కలిగేను కొత్తంగ. వస్తారు పోతారు ఆరు, నిశ్చలముగ ఈడనుండేది నీవు అని.

ఫలశృతిః ఈసోది నిత్యం వల్లిస్తూ జకర్బర్గ్ ఈఏడు (2020) " $23,415,973 సంపాదించేడు అన్న వార్త స్ఫూర్తి ఈ సోదికి. ఉచితలంచి (no such thing as free lunch) అనునది లేదు అన్నది స్పష్టం. .ఈ జాలమార్గాలు తెలీనివారు ఈ ఇచ్చిపుచ్చుకోడాలలో అమాయకంగా తాము ఏమీ ఇవ్వడం లేదనుకుంటారు.

(సెప్టెంబరు 13, 2020)

# కొన్ని ఆలోచనలు

1. అష్టైశ్వర్యాలు గలవాడి ఆనందాన్ని
పిరికితనం హరించివేస్తుంది.

2. కొత్తగా పోయేదేమీ లేదని గ్రహించేక
నిజం పలకడం అతిసులభం.

3. ఇష్టమైనంతకాలం నువ్వు నాకు చేసిన మేలే తలుచుకున్నాను.
మనసు విరిగేక, నీవల్ల కలిగిన నొప్పి మాత్రమే మనసులో మెదుల్తోంది.

4. మరుపులు గానీ జ్ఞాపకాలు కానీ చిన్న శకలాలు మాత్రమే.
కాలక్రమంలో కలిగిన అనుభవాలతో వాటిస్వరూపాలు
మారిపోతూంటాయి.

5. గలవాడు ధరించిన చిరుగులప్యాంటు ఫేషను
లేనివాడిఒంటిమీద వేలాడే పీలికలు దౌర్భాగ్యం.

6. ఇంకొక్క ముద్ద తినాలనిపించినప్పుడు
తినకుండా లేచిపోవడమే డైటింగ్ సూత్రం.

7. సాంకేతికం దినాదినాభివృద్ధి చెందుతోంది.
నీలితెరమీద కర్సర్ వేసే కుప్పిగెంతులు మాత్రం ఎప్పట్లాగే ఉన్నాయి.

8. ప్రతి మహానాయకుడివెనకా ఒక స్త్రీ ఉండేది పూర్వం
ప్రతి అపూర్వ కథామణివెనుకా ఒక సమూహం ఉంటోంది ఇప్పుడు.

9. ప్రజ్ఞ స్వతస్సిద్ధం
పాండిత్యం గిరీశంఅధ్యాపనం.

10. 99శాతం ఇలాగే ఉంటారంటూ నన్ను కొలుస్తారు
మిగిలిన ఆ ఒక్కశాతంలో నేను ఉండవచ్చని ఒప్పుకోరు.

11. ఆటగాడు గెలిస్తే అతడిసామర్థ్యం తెలుస్తుంది.
ఓడిపోయేక అతడివ్యక్తిత్వం తెలుస్తుంది.

12. సమీక్షలు రెండు రకాలు -
రచయితని దృష్టిలో పెట్టుకు చేసేవి
రచనని దృష్టిలో పెట్టుకు చేసేవి.

(జులై 10, 2023)

# సమాప్తం.

# నిడదవోలు మాలతి సాహిత్యవ్యాసంగం వివరాలు

తెలుగు తూలిక - బ్లాగు. మాలతి కథలు, వ్యాసాలు, కవితలూ, తదితర రచనలు.

thuika.net website , founded by Nidadavolu Malathi and featuring Telugu stories and informative/analytical articles on various topics in Telugu literature by Nidadavolu Malathi and other writers/translators.

నిడదవోలు మాలతి తెవికీలో ఇక్కడ

Nidadavolu Malathi on wikipedia in English here

నిడదవోలు మాలతి రచనలు ఆర్కైవ్.ఆర్గ్ లో ఇక్కడ